శ్రీ

శ్రీరస్తు.

శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః.



# శ్రీరామచంద్రశతకము.





ప్రింటర్సు
రావ్సు ప్రింటింగ్ ప్రెస్,
తాడిపత్రి.
1936

కీర్తిశేషుఁడైన నా ప్రియజనకుడు

సుంకిరెడ్డి

# జ్ఞాపకార్థము.

శా॥ శ్రీమారామముఖాబ్జ భాస్కరుడు సంసే
వ్యాంశసంభూతుడున్।
శ్యామాలంకృత భవ్యగాత్రుడు సదాసౌ
జన్యచారిత్రుడున్।
కామక్రోధనిశాచరాంతకుడు సత్కా
రుణ్యపారీణుడున్।
ప్రేమన్స్మరగ బ్రోచి మీకొసగుదండ్రీ!
శాశ్వతానందముల్॥



శ్రీరస్తు.

శ్రీరామపరబ్రహ్మణేనమః.

# శ్రీ రామ చంద్ర శ త క ము.



సీ॥ శ్రీమత్పరంధామ ♦ సేవ్యామరస్తోమ
కల్యాణగుణసీమ ♦ కదనభీమ
నందితసుత్రామ ♦ వసుధాత్మజప్రేమ
రవికులసోమ దా ♦ నవవిరామ
తులసికాదళదామ ♦ తులితమేఘశ్యామ
సంతతార్చితభీమ ♦ సార్వభౌమ
ప్రత్యర్థిసంగ్రామ ♦ బాహుబలోద్ధామ
సుజనాభిరామ య ♦ శోలలామ

తే॥గీ॥ భక్తజనకామ నిర్జిత ♦ పరశురామ
తారకబ్రహ్మనామ కో ♦ దండరామ
పెన్నజూటూరు పురవాస ♦ పృధ్వీలాస
రవికులక్షీరనిధిచంద్ర ♦ రామచంద్ర. 1

సీ॥ శ్రీజానకీనాథ ♦ సౌజన్యశారీర
కౌసల్యగర్భ రా ♦ కాశశాంక

విబుధబృందస్తోమ ♦ వేదాంతసంచార
దినకరకోటి సందీ ♦ ప్తతేజ
శమదమాలంకార ♦ సరసిజనిభహ స్త
యోగిమానసపంక ♦ జోపకంఠ
ఖగకులాధిపయాన ♦ కౌశేయపరిధాన
నవహేమకలితను ♦ న్నతకిరీట
తే॥గీ॥ భాస్కరాబ్జారిలోచన ♦ భవవిదూర
మూలతత్వవిచారణ ♦ ముకురదళన ॥పె॥ 2

సీ॥ అండపిండాండ బ్ర ♦ హ్మాండాధిపుడవంచు
మండిత స్తంభోద్భ ♦ వుండవనుచు
జృంభదోః స్తంభ గం ♦ భీరగూపుడవంచు
తపనీయకశ్యపాం ♦ తకుడవనుచు
అప్రమేయప్రస ♦ న్న ప్రభావుడవంచు
ప్రహ్లాదరక్షిత ♦ ప్రభుడవనుచు
శుంభద్విలాస సం ♦ రంభగాత్రుడవంచు
వజ్రాచల నృసింహ ♦ వజ్రివనుచు
తే॥గీ॥ ధరణిమాయిలువేలుపు ♦ దైవమనుచు
నిన్నుభజియింపుచుండెద ♦ నీరజాక్ష ॥పె॥ 3

సీ॥ రఘురామకార్యార్థు ♦ రంధరధౌరేయ
వానరశ్రేష్ఠాయ ♦ తే నమోస్తు

శౌర్యధైర్యస్థైర్య ♦ సంగ్రామజయఘోర
దానవహరణాయ ♦ తే నమోస్తు
లవణాబ్ధిలంఘనా ♦ లక్ష్యవిచక్షణ
దివ్యప్రభావాయ ♦ తే నమోస్తు
వైదేహిదుఃఖ వి ♦ చ్ఛేదనాహ్లాద సం
దీప్తమనీషాయ ♦ తే నమోస్తు
తే॥గీ॥ యనుచు హనుమంతుగుణవంతు♦నభినుతించి
నిన్నువినుతింతు సతతంబు ♦ నీరజాక్ష ॥పె॥ 4
సీ॥ శ్రీరామముద్రిక ♦ శిరసావహించియు
మించిఘోరాబ్ధి లం ♦ ఘించినావు
లంకిణిబడవైచి ♦ లంకాపురముజొచ్చి
యవనిజాక్షేమంబు ♦ లరసినావు
వనమును బెకలించి ♦ వనపాలకులద్రుంచి
యక్షయాదుల గర్వ ♦ మడచినావు
కోలాహలంబుగ ♦ వాలానలంబున
కడగిలంకాపురి ♦ గాల్చినావు
తే॥గీ॥ యనుచు హనుమంతుధీమంతు ♦ నభినుతించి
నిన్నునిరతంబు సేవింతు ♦ నీలవర్ణ ॥పె॥ 5
సీ॥ నిర్మలచిత్తులై ♦ నిష్ఠాగరిష్ఠులై
ద్వాదశయూర్ధ్వ పుం ♦ డ్రములుదాల్చి

ప్రణవమంత్రంబును ♦ బఠనగావింపుచు
చరమద్వయాదుల ♦ జపమెఱింగి
నటుభవదీయ స ♦ హస్రనామంబులు
బఠియింపుచును చాల ♦ భక్తితోడ
లలితంబగు సహస్ర ♦ తులసీదళంబుల
దినముపూజించిన ♦ దివ్యమతుల
తే॥గీ॥ సుకృతమిద్ధర వర్ణింప ♦ శూలికైన
బ్రహ్మకైనను శక్యమే ♦ పద్మనాభ ॥పె॥ 6
సీ॥ అగజాననాబ్జ ప ♦ ద్మాప్త నమోస్తుతే
యనిగణాధీశ్వరు ♦ నభినుతించి
వాణిషట్పదనీల ♦ వేణి నమోస్తుతే
యనిభారతీదేవి ♦ నాత్మదలచి
పద్మాలయారమా ♦ పద్మా నమోస్తుతే
యనిజనార్ధనుసతి ♦ వినుతిసలిపి
నీలకంధరయు మా ♦ లోల నమోస్తుతే
యనిమహేశ్వరు హృద ♦ యమునపొగడి
తే॥గీ॥ పాహిపాహి నమోస్తుతే ♦ పార్వతీయ
టంచుజెప్పెద శతకంబు ♦ నంచితముగ॥పె॥ 7
సీ॥ వల్మీకభవునకు ♦ వందనంబులొనర్చి
సాత్యవతేయు సం ♦ స్మరణసల్పి

సమరసింహుని చర ♦ ణాబ్జముల్ ధ్యానించి
భవభూతి చతురత ♦ బ్రస్తుతించి
కాళిదాసునుతించి ♦ ఘనమయూరుదలంచి
పండితదండిని ♦ బ్రణుతిసల్పి
జయదేవువినుతించి ♦ సరసబిల్హణునెంచి
మల్హణుభజియించి ♦ మాఘుగొలిచి
తే॥గీ॥ ఇతరగీర్వాణ కవుల నా ♦ హృదయమందు
నిలిపి సీమీద పద్యముల్ ♦ నేరచింతు॥పె॥ 8

సీ॥ బమ్మెరపోతన ♦ బ్రణుతులొనర్చిన
న్నయభట్టుగొలిచి శ్రీ ♦ నాథుదలచి
తిక్కనయజ్వకి ♦ మ్రొక్కులుఘటియించి
కంకంటిపాప రా ♦ ట్కవినుతించి
యలసానిపెద్దన ♦ నభినుతులొసరించి
భటుమూర్తి నెమ్మది ♦ బ్రస్తుతించి
భాస్కరాఖ్యునకు న ♦ మస్కారమొనరించి
రామకృష్ణకవీంద్రు ♦ రహినుతించి
తే॥గీ॥ మఱియు నితరాంధ్రకవుల సం ♦ స్మరణసల్పి
సీసశతకంబు జెప్పెద ♦ చిత్తగింపు ॥పె॥ 9

సీ॥ వసుదేవతనయుండు ♦ వాసవాత్మజునకు
గరమర్థితోడైన ♦ కరణిధరణి

నరసింహాసత్కవి ♦ నాకు సహాయుడై
ననుశిష్యుని గనుగై ♦ కొనియు మొదట
గణయతిప్రాస ల ♦ క్షణములెఱింగించి
కావ్యశబ్దార్థ సం ♦ గతులు నేర్పి
శ్రీహరిచిత్ర చా ♦ రిత్రముల్ రచియించి
ఘనుడవై వర్థిల్లు ♦ మనియెగాన
తే॥గీ॥ నట్టిసద్గురు చరణంబు ♦ లాత్మనిల్పి
జెప్పబూనితి మీకృప ♦ చేతకవిత ॥పె॥ 10

సీ॥ పతిసేవయే మహా ♦ వ్రతముగా భావించు
నాత్మేశుడే దైవ ♦ మనిదలంచు
రమణునిభుక్త శే ♦ షము శ్రీహరి ప్రసా
దంబని భక్తితో ♦ నారగించు
ధవు నాజ్ఞనొకనాడు ♦ జవదాటక జరించు
నతిథులసంప్రీతి ♦ నాదరించు
మగనివాక్యము వేద ♦ మంత్రంబుగ బఠించు
సాధ్వీమణులగూడి ♦ సంచరించు
తే॥గీ॥ యవని శ్రీసుంకిరెడ్డి య ♦ ర్థాంగలక్ష్మి
యైన మాతల్లి సుంకాంబ ♦ నభినుతింతు ॥పె॥ 11

సీ॥ వ్రతములపై నిజ ♦ స్వాంతంబు జొనుపదు
ధవునిసేవావ్ర ♦ తంబెకాని

దీర్ఘసేవలకు తా ♦ దిరముగానరుగదు
పతినిసేవించు వాం ♦ ఛితమెకాని
దేవతార్చనలపై ♦ స్థిరబుద్ధినిలుపదు
రమణునిపూజించు ♦ భ్రమయెకాని
యెక్కప్రౌఢ్యోక్ష నా ♦ డుండనూహించదు
వల్లభుండు భుజించు ♦ వరకెకాని
తే॥గీ॥ యనుచుబుధులెన్న వెలయుసుం♦కాంబయామె
గర్భముక్తాఫలుడ నన్ను♦కావుమయ్య॥పె॥ 12

సీ॥ సత్యకీర్తుల హరి ♦ శ్చంద్రుండు చంద్రుండు
వితరణంబున దివా ♦ పతిసుతుండు
కృతసుధీవిద్యల ♦ గీష్పతిగీర్పతి
రమ్యభోగముల ధ ♦ రాయరాతి
కరుణావిభూతుల ♦ మురవైరిపురవైరి
సౌందర్యగరిమను ♦ శంబరారి
ధైర్యవిక్రమముల ♦ ధరణిభృద్వైరదభిః
ద్వినయ ధర్మంబుల ♦ ఘనమరుత్తు
తే॥గీ॥ సుజనులకు వేల్పుగడ్డి శ్రీ ♦ సుంకిరెడ్డి
ననిశముమదీయ జనకు నే♦నభినుతింతు॥పె॥ 13

సీ॥ అలఘుపాతివ్రత్య ♦ విలసద్గుణంబుల
కాటపట్టైన సుం ♦ కాంబసుతుడు

నక్షత్రపట్టణ ♦ నరసింహాసత్కవి
సరసప్రభాంచిత ♦ ఛాత్రవరుడు
నతసురపతి పట్ట ♦ ణమునకు దీటగు
పెన్నజూటూరు సం ♦ వేశయుతుడు
సాహిత్య నైపుణ్య ♦ సంఘంబులకు మహా
ప్రియుడు రంగస్వామి ♦ రెడ్డి ఘనుడు
తే॥గీ॥ సలలితంబుగ నీసేవ ♦ సలుపువాడు
భూరికరుణార్ద్రమతితోడ♦బ్రోవుమయ్య॥ పె॥ 14
సీ॥ ఏకళంకము లేని ♦ పాకనాటికులాబ్ధి
పరిపూర్ణలలిత శు ♦ భ్రాంశకరుడు
యనుపమకల్యాణ ♦ ఇనుమద్దిసద్గోత్ర
రాకావిహారకై ♦ రవహితుండు
శిష్టజనానంద ♦ చిన్నసుబ్బారెడ్డి
భాసురపౌత్రుండు ♦ భవ్యయశుడు
పరమవిద్యాప్రౌఢి ♦ పల్కి బొంకనినవ్య
సుంకిరెడ్డి సుపుత్ర ♦ శోభితుండు
తే॥గీ॥ శ్రీకరుండు రంగస్వామి ♦ రెడ్డి ఘనుడు
విమలమతినిన్ను నెప్పుడు సే♦వించుచుండు॥ పె॥ 15
సీ॥ ఆంధ్రధనీషుంటువు ♦ లరసిచూడగ లేదు
సంస్కృతకావ్యముల్ ♦ చదువ లేదు

ధర్మశాస్త్రంబులు ♦ దరచిచూడగ లేదు
చెలగిలతుణ మభ్య ♦ సింప లేదు
పరమాత్మ నీసత్కృ ♦ పాప్రభావంబున
విరచింపబూనితి ♦ విమలమతిని
మత్కృతివిఖ్యాతి ♦ మహిమాతిశయమున
రంజిల్లజేయు భా ♦ రంబునీదె
తే॥గీ॥ సాగరముదోమదాటిన ♦ చందమునను
బూనితికవిత్వమును జెప్ప ♦ భోగిశయన॥పె॥ 16

సీ॥ శ్రీరామ నీనామ ♦ చింతనామృతము నా
జిహ్వాకురుచిబుట్ట ♦ జేయుమయ్య
రఘురామ నీశ్యామ ♦ ల స్వరూపంబు నా
చూట్కుల కింపార ♦ జూపుమయ్య
జయరామ నీనామ ♦ సద్వాక్యరుచులు నా
చెవుల కానందంబు ♦ జేయుమయ్య
శుభరామ నీప్రేమ ♦ శుభదాయకంబుగా
నిరుతంబు నామీద ♦ నిలుపుమయ్య
తే॥గీ॥ రామ హరిరామ పట్టాభి ♦ రామ పరశు
రామగర్వ విరామ సం ♦ గ్రామభీమ॥పె॥ 17

సీ॥ సంసారబంధ పా ♦ శము ద్రెంచవచ్చు నీ
నామమంత్రము చేత ♦ నళిననాభ

పంచపాతకముల ♦ బరిమార్పవచ్చు నీ
నామమంత్రముచేత ♦ నళిననాభ
యమకింకరుల నాట్య ♦ మాడింపవచ్చు నీ
నామమంత్రముచేత ♦ నళిననాభ
మృత్యువు నెదురించి ♦ మెలగంగవచ్చు నీ
నామమంత్రముచేత ♦ నళిననాభ
తే॥గీ॥ సకల లేములు కామాది ♦ షడ్గుణములు
మాన్పగావచ్చు నీనామ♦మంత్రమునను॥ పె॥18

సీ॥ పద్మలోచన నిన్ను ♦ బ్రస్తుతించి తెచాలు
జపములు పదివేలు ♦ సలుపనేల
తాటకాంతక నిన్ను ♦ దర్శించి తేనాలు
తీర్థయాత్రలు వేయి ♦ దిరుగనేల
గోవిందయని నిన్ను ♦ కొనియాడి తేచాలు
మున్నీటినదులలో ♦ మునుగనేల
మాధవాయని నిన్ను ♦ మఱవకుండి తెచాలు
రామకోటి యటంచు ♦ వ్రాయనేల
తే॥గీ॥ భక్తి మీనామ సన్మంత్ర ♦ పఠనజాలు
యితరమంత్రములను బఠి ♦ యింపనేల॥ పె॥19

సీ॥ తెరగంటిబ్రమాని పూ ♦ దేనిగ్రోలుటమాని
మదనంబులకును తు ♦ మ్మెదలుజనునె

చదలేటితరగల ♦ సంచరించుటమాని
కలహంసలు తరంగి ♦ ణులకుజనునె
లలితమామిడి చిగు ♦ ళ్లను భుజించుటమాని
పికములు కుటజంబు ♦ లకునుజనునె
నిండుపున్నమనాటి ♦ పండువెన్నెలమాని
తిమిరంబులకు చకో ♦ రములుజనునె
తే॥గీ॥ నిన్నుధ్యానించి సేవించు ♦ నిపుణమతులు
నితరసేవలొనర్తురే ♦ యిందిరేశ ॥పె॥ 20
సీ॥ సాగరంబులదుగ్ధ ♦ సాగరంబునుహెచ్చు
సతులలో జానకీ ♦ సతియుహెచ్చు
ధేనువులను కామ ♦ ధేనువు కడుహెచ్చు
ఋషులలో నారద ♦ రుషియుహెచ్చు
శేషులలో నాది ♦ శేషుడొక్కడుహెచ్చు
దొడవులనాసికా ♦ దొడవుహెచ్చు
పాదంబులకల్ప ♦ పాదపంబునుహెచ్చు
గ్రహములలో రవి ♦ గ్రహముహెచ్చు
తే॥గీ॥ నిఖిలదేవగణంబుల ♦ నీనెహెచ్చు
హెచ్చుగానిన్ను సేవింతు ♦ యినకులేశ॥పె॥21
సీ॥ దశరథసుతరామ ♦ తాటకాంతకరామ
సవనరక్షితరామ ♦ సదయరామ

చాపఖండనరామ ♦ జనకరాట్సుతరామ
భార్గవరామ గ ♦ ర్వజితరామ
దండకాటవిరామ ♦ దానవాంతకరామ
యుర్వీతనూజావి ♦ యోగరామ
వాలిమర్ధనరామ ♦ వనధిబంధనరామ
దశకంఠఘటకర్ణ ♦ దళితరామ
తే॥గీ॥ స్థిరవిభీషణ లంకాభి ♦ షేకరామ
యవనిజాయుతరామ ప ♦ ట్టాభిరామ॥ పె॥ 22

సీ॥ పంచదారయుకంటె ♦ పరమాన్నమునకంటె
జుంటితేనియకంటె ♦ జున్నుకంటె
దధిఘృతక్షీరాన్న ♦ మధురసంబులకంటె
యతిరసభక్ష్య భో ♦ జ్యములకంటె
కదళికాఫలపెండె ♦ ఖర్జూరములకంటె
కండచక్కెర పాన ♦ కమునకంటె
శృంగారసాహిత్య ♦ శృతిగానములకంటె
దరుణులనధరామృ ♦ తములకంటె.
తే॥గీ॥ యనుదినంబును నీస్మర ♦ ణామృతంబు
రూఢిగాగ్రోలుటయు చాల ♦ రుచికరంబు॥ పె॥ 23

సీ॥ అపరాధమొకరి యం ♦ దాచరింపని మహో
జీవజంతువుల హిం ♦ సించువారు

తల్లిదండ్రులమీద ♦ దయయొకించుక లేక
భీకరకష్టముల్ ♦ పెట్టువారు
పరకామినులగాంచి ♦ భావంబునభ్రమించి
మోహాంబునిధిలోన ♦ మునుగువారు
దానధర్మము లేక ♦ దాక్షిణ్యమును లేక
బెట్టుగానతిథుల ♦ దిట్టువారు
తే॥గీ॥ కొంటెలై బీదసాధుల ♦ గొట్టువారు
నట్టివారలు నీకుగా ♦ నట్టివారు ॥పె॥ 24

సీ॥ భూతదయార్ద్ర సం ♦ ప్రీతిచేతస్కులై
నందఱ నొకరీతి ♦ నరయువారు
తల్లిదండ్రుల నిజ ♦ దైవంబుగానెంచి
సతతంబు పూజలు ♦ సలుపువారు
పరకాంతనిజమాత ♦ కరణి భావింపుచు
దూరభావంబున ♦ దొలగువారు
చాలక్షుదార్తులై ♦ చనుదెంచు నతిథుల
భక్తితోఁ పూజించి ♦ బనుపువారు
తే॥గీ॥ వారలందరు ముందు నీ ♦ వారలగుచు
నీదుసాన్నిధ్యమును జేరి ♦ నిలచువారు॥పె॥ 25

సీ॥ దివ్యౌషధంబు నీ ♦ భవ్యనామస్తుతి
దీర్ఘరోగములకు ♦ దివిజవినుత

పదునుఖడ్గంబు నీ ♦ భవ్యనామస్తుతి
భవబంధలతలకు ♦ పద్మనాభ
బడబాగ్నికణము నీ ♦ భవ్యనామస్తుతి
గల్మపాటవులకు ♦ గమలనయన
వజ్రాయుధంబు నీ ♦ భవ్యనామస్తుతి
ఘోరాతిగిరులకు ♦ కుజనహరణ
తే॥గీ॥ భయదదుఃఖాంబుదములకు ♦ పవనమూర్తి
యనుచు నీకీర్తినేకొని♦యాడుచుందు॥ పె॥ 26
సీ॥ వత్సరారమ్మని ♦ వరభూషణాంబరా
వళులివ్వదలచితో ♦ వలదునాకు
తనయరారమ్మని ♦ ధనరత్నహేమరా
సులనివ్వదలచితో ♦ వలదునాకు
పుత్రకారమ్మని ♦ భూరిసౌభాగ్య సం
పదలివ్వదలచితో ♦ వలదునాకు
కోమరరారమ్మని ♦ కువలయసామ్రాజ్య
పదమివ్వదలచితో ♦ వలదునాకు
తే॥గీ॥ నేనుగోరిన దొక్కటే ♦ నీకటాక్ష
మునకొసంగుముమోక్షంబు♦మురవిదార॥ పె॥ 37
సీ॥ అంత్యకాలమునందు ♦ నాయాసపడువేళ
మాధవానీసేవ ♦ మరతునేమొ

యమకింకరులువచ్చి ♦ యదమిపట్టెడువేళ
మాధవానీసేవ ♦ మరతునేమొ
కఫవాతములుగప్పి ♦ గంపమొందెడువేళ
మాధవానీసేవ ♦ మరతునేమొ
బంధురయమపాశ ♦ బంధబాధలవేళ
మాధవానీసేవ ♦ మరతునేమొ
తే॥గీ॥ నాడుమరచెదననుభీతి ♦ నాటిమదిని
ప్రతిదినంబిట్లు సేవింతు ♦ పద్మనాభ ॥పె॥ 28

సీ॥ తనువులస్థిరమని ♦ ఘనముగాదెలియక
మోహాబ్ధిలోబడి ♦ మునకలిడుచు
సంసారబద్ధులై ♦ షడ్భావంతులకుఁజిక్కి
సతిసుతాదులును శా ♦ శ్వతములనుచు
మూఢులైయజ్ఞాన ♦ గాడాంధకారంబు
లోజిక్కువడి పెను ♦ లోభులగుచు
దానధర్మములేక ♦ ధనముసంపాదించి
విఱ్ఱవీగుచు చాల ♦ వెఱ్ఱులగుచు
తే॥గీ॥ కడకునినుగాంచు మార్గంబు ♦ గానలేక
నరకకూపంబులంబడి ♦ బొరలుచుంద్రు॥పె॥29

సీ॥ భార్యాసుతాదుల ♦ భ్రాంతియొక్కటెకాని
తనవెంటనెవ్వరు ♦ దరలిరారు

బంధుకోటియటంచు ♦ భ్రమతయొక్కటె కాని
చెడినవేళల దాపు ♦ జేర్చుకొనరు
దాయాదులని ప్రీతి ♦ దవిలియుండుటె కాని
నొక్కని బ్రతుకుకు ♦ నోర్వలేరు
అన్నదమ్ములటంచు ♦ నాశయొక్కటె కాని
కీడు వేళలకండ్ల ♦ జూడబోరు
తే॥గీ॥ ఇట్టి తాపత్రయంబులు ♦ గొట్టివేసి
గట్టిగానిన్ను నమ్మిన ♦ గల్గుముక్తి ॥పె॥ 30
సీ॥ జననిగర్భమునుండి ♦ జననమాటాదిగా
గలుషమార్జించితి ♦ ఖలుడనైతి
బీదసాధులబట్టి ♦ పెనుబాధపెట్టితి
బిక్షుమర్థికిచేత ♦ బెట్టనైతి
విబుధసంసేవనల్ ♦ విషముగాజూచితి
దుష్టులతోపొందు ♦ దొలగనైతి
ధూర్తుండనై లోక ♦ దూషణలందితి
సత్పుణ్యకార్యముల్ ♦ సలుపనైతి
తే॥గీ॥ నిపుడు నీదాపు జేరితి ♦ నించుకైన
దేవ నా తప్పులెంచక ♦ బ్రోవుమయ్య॥పె॥ 31
సీ॥ నారాయణుని నయ ♦ నములజూచెదనంటె
బదరికకేతెంచు ♦ బలము లేదు

వేంకటేశ్వరుని సే ♦ వించివచ్చెదనంటె
శేషాచలం బెక్క ♦ చేతగాదు
నారసింహుని కన్ను ♦ లారగాంచెదనంటె
నిడిత్రోవకొండలో ♦ నడువలేను
రంగనాయకుల ♦ దర్శనముచేయుదమంటె
శ్రీరంగనగరంబు ♦ దూరమిటకు
తే॥గీ॥ సర్వమయుడవటంచు నీ ♦ స్మరణ నేను
సలుపుచుండెదనిచ్చట ♦ సంతతంబు ॥పె॥ 32
సీ॥ జోహారునీకు య ♦ శోదాకు మారన
మస్కృతుల్ నీకుర ♦ మాకళత్ర
వందనంబులునీకు ♦ వసుదేవనందన
దండంబునీకు కో ♦ దండపాణి
సాష్టాంగములునీకు ♦ సారంగనుతపాత్ర
జేజేలునీకు బి ♦ డౌజవినుత
నేరెడల్లులునీకు ♦ నీలనీరదగాత్ర
టెంకణాలిదెనీకు ♦ పంకజాక్ష
తే॥గీ॥ గిడిగిడుల్ నీకు గోవింద ♦ కృష్ణశౌరి
చెంగనాలుపతంగతు ♦ రంగనీకు ॥పె॥ 33
సీ॥ అందకత్తెలగాంచి ♦ యానందమువహించి
నిత్యంబునిన్ను ధ్యా ♦ నింపనైతి

సంసారదుస్తర ♦ సాగరంబునజిక్కి
తిన్నగానిన్ను స్తు ♦ తింపనైతి
కఠినచిత్తులజేరి ♦ కల్మషంబులమీరి
దివ్యనీగాథలు ♦ దెలియనైతి
మదలోభమోహాహంకా ♦ మక్రోధములజిక్కి
పరమకైవల్యంబు ♦ బడయనైతి
తే॥గీ॥ నవనిలోనన్ను పుట్టించి ♦ నందుకేమి
భవ్యఫలితంబులేదాయె ♦ స్వల్పమైన॥పె॥ 34

సీ॥ శ్రీరామనీజప ♦ సారమెఱుంగను
దాక్షాయణీ ప్రియ ♦ ధవుడగాను
దశరథాత్మజ నీయ ♦ థార్థోక్తులుగణింప
దశకంఠసహజ సో ♦ దరుడగాను
రామనీదివ్యాంఘ్రి ♦ రజ మహాత్వమెఱుంగ
గౌతమమునికులాం ♦ గననుగాను
యజ్ఞాతునీదు మా ♦ యాశక్తిదెలియంగ
బలిసురప్రత్యర్థి ♦ ప్రభుడగాను
తే॥గీ॥ పరమమూఢుడజడుడనే ♦ మెఱుగజాల
యావనిజాలోల బ్రోవుద ♦ యాలవాల॥పె॥35

సీ॥ గాంధారిసుద్దులు ♦ గదశివిందురుగాని
కైవల్యసాధన ♦ కథలువినరు

ప్రతినకు పదినాళ్లు ♦ పస్తులుందురుగాని
యొక్క ప్రొద్దొకనాడు ♦ యుండలేరు
బలువైనపాషాణ ♦ పంక్తిమోతురుగాని
భక్తిదేవునిమోయ ♦ పాలుపడరు
బెట్టుగానతిథుల ♦ దిట్టుచుందురుగాని
బిడిసెడుకవలంబు ♦ బెట్టలేరు
తే॥గీ॥ దోయజదళాక్ష యిటువంటి ♦ దుష్టజనులు
నిన్నుభజియింపనేర్తురే ♦ నిమిషమైన॥ పె॥ 36
సీ॥ దురితంపుపనులకు ♦ దొడరుచుందురుగాని
పుణ్యకార్యములకు ♦ బూనుకొనరు
పరధనంబులకాశ ♦ పడియుందుదురుగాని
దమసొమ్మునొకరికి ♦ దరలనివరు
యనిశంబునన్నృతంబు ♦ లాడుచుందురుగాని
నోరూరసత్యంబు ♦ నుడువలేరు
నూరార్లు లంచంబు ♦ నూకుచుందురుగాని
చేయెత్తిదానంబు ♦ సేయలేరు
తే॥గీ॥ గొలిచెదరు మానవులు పొట్ట ♦ కూటికొరకు
గొలువనేరరు మోక్షంబు♦కొరకు నిన్ను॥ పె॥ 37
సీ॥ వల్కలంబులుగట్టి ♦ వనభూములనుమెట్టి
దపమాచరించెదు ♦ ధన్యులైన

వేదశాస్త్రపురాణ ♦ వివిధవిద్యాభ్యాస
నిరతులై విలసిల్లు ♦ నిపుణులైన
తీర్థయాత్రలు సదా ♦ దిరుగుచుకృతకృత్య
నదులుగ్రుంకెడుపుణ్య ♦ హృదయులైన
సర్వాధ్వరంబులు ♦ జరిపించువారల
కధిపతులగు సోమ ♦ యాజులైన
తే॥గీ॥ విపులదోర్గర్వమున విట్టి ♦ వీగినిన్ను
గానకుండిన మోక్షంబు ♦ గానలేరు॥పె॥ 38
సీ॥ భక్తమందార నీ ♦ భజనజేసెదగాని
ననుస్వచిత్తుని జేసి ♦ మనుపుమయ్య
శ్రితజనాధార నీ ♦ సేవసల్పెదగాని
కడకునాపఙ్క్తింతు ♦ లుడుపుమయ్య
పుండరీకాక్ష నీ ♦ పూజసల్పెదగాని
భవబంధముల బాధ ♦ బాపుమయ్య
జగదీశనీకు దా ♦ స్యంబుసల్పెదగాని
నాయఘంబులు బాయ ♦ ద్రోయుమయ్య
తే॥గీ॥ విశ్వధ్యాయక నిన్నుసే ♦ వింతుగాని
చింతలెడబాపి నీచెంత ♦ జేర్చుమయ్య॥పె॥ 39
సీ॥ కుండలో దిరుగుచు ♦ నుండు తెడ్డెరుగునా
పాయసమురుచి జి ♦ హ్వయు నెరుంగు

ప్రసవవేదనలు గొడ్డు ♦ రాలు నెరుంగునా
తనయులగన్నట్టి ♦ తల్లియెరుగు
సన్యాసియెరుగునా ♦ సంసారవర్తనల్
ధరగృహస్థాశ్రమ ♦ ధన్యుడెరుగు
రంకురాలెరుగునా ♦ రమణుసేవకవృత్తి
సాధ్వీలలామయౌ ♦ సతియెరుంగు
తే॥గీ॥ మూఢచిత్తుడెరుంగునా ♦ ముక్తిబాట
ఘనముగానీదు భక్తాగ్ర ♦ గణ్యుడెరుగు॥ పె॥40
సీ॥ సకలలోకంబుల ♦ సంచరింపగవచ్చు
మంచికూపముల త్ర ♦ వ్వించవచ్చు
బరతెంచుబాధల ♦ బారదోలగవచ్చు
హార్షసుఖంబుల ♦ నందవచ్చు
వేదసారంబుల ♦ వివరించిచెప్పగవచ్చు
శ్రేష్ఠక్రతువులెల్ల ♦ జేయవచ్చు
తపనీయభూముల ♦ దారబోయగవచ్చు
మేటిక్షేత్రముల ని ♦ ర్మింపవచ్చు
తే॥గీ॥ మనసునిల్వడగావించి ♦ మమతతోడ
నిన్ను సేవింప కష్టంబు ♦ నీరజాక్ష ॥పె॥ 41
సీ॥ తాపసోత్తములకు ♦ ధర్మమోక్షముచింత
విద్వాంసులకుతర్క ♦ విద్యచింత

పార్థివో త్తములకు ♦ ప్రవిదారణముచింత
నలిదరిద్రులకు నా ♦ నాకచింత
విటకాంద్రకు మనోజ్ఞ ♦ వేశ్యాంగనలచింత
తస్కరులకు దొంగ ♦ తనముచింత
పరమలోభులకు సం ♦ పాదనపైచింత
అన్నప్రదాతల ♦ కతిథిచింత
తే॥గీ॥ పోసగజారిణులకు పర ♦ పురుషుచింత
భక్తవరులకు నీనామ ♦ భజనచింత॥ పె॥ 42
సీ॥ చెడును దేహంబులు ♦ చెడునుగేహంబులు
నళినాక్షు సంకీర్త ♦ నములుచెడవు
చెడునుభోగంబులు ♦ చెడునుభాగ్యంబులు
నళినాక్షు సంకీర్త ♦ నములుచెడవు
చెడునుయవ్వనములు ♦ చెడునుజీవనములు
నళినాక్షు సంకీర్త ♦ నములుచెడవు
చెడునురాజ్యంబులు ♦ చెడునుపూజ్యంబులు
నళినాక్షు సంకీర్త ♦ నములుచెడవు
తే॥గీ॥ అనుచు మీనామభజనంబు ♦ ననుదినంబు
సలుపువారికిమోక్షంబు♦గలుగుటరుదె॥ పె॥43
సీ॥ విపులాటవుల ఘోర ♦ తపమాచరించెడు
మునులకు సంసార ♦ మోహమేల

తీర్థయాత్రలు సదా ♦ దిరుగు సాధువులకు
తపనీయరత్న సౌ ♦ ధంబులేల
ప్రణవంబు జపియించు ♦ భవ్యమానసులకు
దరుచుగా వేరేమం ♦ త్రంబులేల
మొనసి గంగాస్నాన ♦ మొనరించు ఘనులకు
నిత్యసత్కర్మాది ♦ నిష్ఠలేల
తే॥గీ॥ నిన్నుస్మరియించి సేవించు ♦ విప్రులకును
వేరెదైవంబులనుమది ♦ నెదుకనేల ॥పె॥ 44

సీ॥ సర్వలోకేశ మీా ♦ సంకీర్తనంబులు
వినసహింపనివాని ♦ వీనులేల
వసుదేవతనయ మీా ♦ వదనంబు కాంక్షతో
చూడజాలనివాని ♦ చూట్కులేల
సురలోకనుత మిమ్ము ♦ సుస్థిరంబుగను పూ
జింపనేరనివాని ♦ చేతులేల
జలజాయతేక్షణ ♦ సద్భక్తితో మీాకు
మ్రొక్కనేరనివాని ♦ మూర్ధమేల
పద్మామనోహర ♦ పలుమాఱు మిమ్ము భ
జింపనేరనివాని ♦ జిహ్వయేల
తే॥గీ॥ చెలగిమీాదివ్యలీలలు ♦ చిత్తమందు
మరచియుండినివాని జ ♦ న్మంబదేల॥ పె॥ 45

సీ॥ పంచసంస్కార పా ♦ వనగాత్రపరుఁడైన
వాఁడెపోవసుధలో ♦ వైష్ణవుండు
లలితోర్ధ్వపుంద్ర ల ♦ లాటసన్నిభుఁడైన
వాఁడెపోవసుధలో ♦ వైష్ణవుండు
ప్రణవార్థతత్వార్థ ♦ పంచకంబెరిగిన
వాఁడెపోవసుధలో ♦ వైష్ణవుండు
సద్గురుతీర్థప్ర ♦ సాద యోగ్యుండైన
వాఁడెపోవసుధలో ♦ వైష్ణవుండు
తే॥గీ॥ వైష్ణవస్వాములను మహా ♦ విష్ణువనుచు
భక్తిసేవించువాఁడెపో ♦ వైష్ణవుండు॥పె॥ 46
సీ॥ అనిశంబుదారిద్ర్య ♦ మనుభవించుటరోత
చెడిచుట్టములచెంత ♦ జేరరోత
ధాన్యంబులేక సే ♦ ద్యంబుసేయుటరోత
పరపూటలెప్పుడు ♦ బడుటరోత
స్త్రీభాగ్యమున సదా ♦ జీవించుటయురోత
భారహావంబున ♦ బ్రతుకరోత
తెగనిరోగంబున ♦ నొగులుచుండుటరోత
చేయొగ్గియాచన ♦ సేయరోత
తే॥గీ॥ సతతమిల్లంట్రిముండుట ♦ చాలరోత
కష్టపడకుండ కాలంబు ♦ గడుపరోత॥పె॥ 47

సీ॥ పాండవేయులు మేటి ♦ బాంధవులా నీకు
పరమాప్తుడా నీకు ♦ భానుసుతుడు
విడరానిచుట్టమా ♦ వినుచూలిపుత్రుండు
ప్రియస్నేహితుండా వి ♦ భీషణుండు
నీకులగురువర్యు ♦ డా కుచేలుండు నీ
గారాబుతనయుడా ♦ గజవిభుండు
వెనుకుముందా నీకు ♦ దనుజేశు తనయుండు
దోబుట్టువా నీకు ♦ ద్రుపదతనయ
తే॥గీ॥ వారినందరి బ్రోచిన ♦ వరుసనన్ను
కావవది యేమిభక్తుండ ♦ గానెనీకు॥పె॥ 48

సీ॥ అభవుండవైన వినో ♦ దార్థంబు ధరణిలో
నవతరింతువు నీవు ♦ భువనవినుత
మాయారహితుడవై ♦ మాయచేమహిమంబు
గాంచుచుందువు నీవు ♦ కమలనాభ
సంరక్షకుండవై ♦ చాలనుగ్రుండవై
పొడవడంతువు నీవు ♦ భుజగశయన
నిష్కారణుండవై ♦ నిఖిలకారణభూత
హేతుండవౌ దీవు ♦ నిందిరేశ
తే॥గీ॥ అఖిలమహిమాతిశయముల ♦ నలరుచున్న
నిన్నువర్ణింపశక్యమే ♦ నిర్జరులకు ॥పె॥ 49

సీ॥ పృథ్వీశ్వరుండయ్యు ♦ బేరమాడెడువాడు
బంధువిరోధియై ♦ బరగువాడు
నన్యవనంబులు ♦ నరికి వైచెడువాడు
భృతికి వేదముజెప్పి ♦ బ్రతుకువాడు
నతిథికాకలిదీర్ప ♦ కన్నంబుదినువాడు
కన్నకూతురి బట్టు ♦ కొన్నవాడు
భవనముల్ సప్తార్చి ♦ పాలుజేసెడివాడు
వరపర్వగామియై ♦ దిరుగువాడు
తే॥గీ॥ బ్రహ్మకల్పాంతరంబులు ♦ రౌరవాది
నరకకూపంబులనుబడి ♦ బొరలుచుండు॥ పె॥50

సీ॥ నీరజాతేక్షణ ♦ నీకొలువేకొల్వు
హీనమానవుల కొ ♦ ల్వేటికొలువు
నిర్జరారి విదార ♦ నీసేవయేసేవ
హీనమానవుల సే ♦ వేటిసేవ
నీలనీరదగాత్ర ♦ నీపూజయేపూజ
యితర దైవముల పూ ♦ జేటిపూజ
నిఖిలామరస్తోత్ర ♦ నీభజనేభజ
నితర వేల్పుల భజ ♦ నేటిభజన
తే॥గీ॥ దనుజహరనీదు వినుతియే ♦ వినుతిగాని
యితరమానవ వినుతియ ♦ దేటివినుతి॥ పె॥ 51

సీ॥ తిరుపతి వేంకటే ♦ శ్వరు నాశ్రయించితే
సాకడా నన్ను ప్ర ♦ సాదమిచ్చి
ఘనయహోబిల నృసిం ♦ హునిపంచగాచితే
సాకడా నన్ను ప్ర ♦ సాదమిచ్చి
కంచిలో నేనున్న ♦ కరిగిరివరదుండు
సాకడా నన్ను ప్ర ♦ సాదమిచ్చి
శ్రీరంగనాథుని ♦ జేరి సేవించితే
సాకడా నన్ను ప్ర ♦ సాదమిచ్చి
తే॥గీ॥ అంతదూరంబుజని వారి ♦ నాశ్రయింప
వలయునా నన్ను బ్రోవనీ ♦ వలనగాదె॥పె॥ 52

సీ॥ దశరథరాముడే ♦ తల్లిదండ్రియునాకు
రఘుకులరాముడే ♦ రక్షకుండు
జానకీరాముడే ♦ శాశ్వతబంధుండు
శ్రీజయరాముడే ♦ స్నేహితుండు
కోదండరాముడే ♦ గురువు దైవమునాకు
దురితవిరాముడే ♦ తోడునీడ
కల్యాణరాముడే ♦ ఘనమైన యాప్తుండు
పట్టాభిరాముడే ♦ పట్టుగొమ్మ
తే॥గీ॥ యనుచు సద్భక్తితోడుత ♦ ననుదినంబు
నిన్ను సేవింపుచుండెద ♦ నన్ను బ్రోవు॥పె॥ 53

సీ॥ నీనామమంత్రంబు ♦ నిరుతంబుజపియించి
భవబంధములబాసె ♦ పవనసుతుడు
నీనామమంత్రంబు ♦ నిరుతంబుజపియించి
ధన్యాత్ముడయ్యెను ♦ దనుజసుతుడు
నీనామమంత్రంబు ♦ నిరుతంబుజపియించి
వరపుణ్యుడయ్యెను ♦ భానుసుతుడు
నీనామమంత్రంబు ♦ నిరుతంబుజపియించి
పృథుకీర్తిగాంచెవి ♦ భీషణుండు
తే॥గీ॥ అట్టిశక్తిదలంప నా ♦ యందులేదు
భక్తిమాత్రంబెగాని యో♦పరమపురుష॥పె॥ ౫౪

సీ॥ వనజాక్షునర్చించు ♦ వానికరంబుల
సుకృతమెన్నగతమ్మి ♦ చూలివశమె
వనమాలి భజియించు♦వాని జిహ్వాయొసర్చు
సుకృతంబుగణియింప ♦ సురులవశమె
విష్ణుచారిత్రముల్ ♦ వినువానివీనుల
సుకృతంబుపరింప ♦ శూలివశమె
వైకుంఠువీక్షించు ♦ వాని నేత్రంబుల
సుకృతంబుబొగడ శే ♦ షునివశంబె
తే॥గీ॥ చిత్తమని శంబుశ్రీశుపై ♦ జేర్చువాని
జన్మమునుతింపచంద్ర భా♦స్కరులవశమొ॥పె॥ ౫౫

సీ॥ యజ్ఞకర్తవునీవె ♦ యజ్ఞభోక్తవునీవె
యజ్ఞఫలప్రదా ♦ యకుడవీవె
వేదంబులునునీవె ♦ వేదాంగములునీవె
వేదస్మృతానంద ♦ విదుడవీవె
నిర్వికారుడవీవె ♦ నిర్మలాత్ముడవీవె
నిత్యనిరంజనా ♦ న్వితుడవీవె
మూడుమూర్తులునీవె ♦ మువ్వురికావలనీవె
మూలవిరాట్స్వ స్వ ♦ మూర్తివీవె
తే॥గీ॥ వివిధ వేల్పులునీవెత ♦ ద్విభుడవీవె
నిన్నుగొనియాడ శక్యమే ♦ నీరజాక్ష॥ పె॥ 56

సీ॥ అట్టెనీకడనట్టి ♦ హాసంబుజేసిన
ప్రణవంబుజపియించు ♦ ఫలమటంచు
దరుచుగానీశస్త్ర ♦ ధారలమునిగిన
భాగీరథీస్నాన ♦ ఫలమటంచు
నిమదకోపంబున ♦ నిన్నువీక్షించిన
బహుకాలచింతనా ♦ ఫలమటంచు
బెదరింత లేక ని ♦ న్నదలించి తిట్టిన
ప్రాబల్యులనుతించు ♦ ఫలమటంచు
తే॥గీ॥ సమరభూమిని నీచేత ♦ చావుగోరి
రామనీతోటి పగబూనె ♦ రావణుండు॥ పె॥ 57

సీ॥ పాటింపపితృవాక్య ♦ పరిపాలనముకంటె
మాతృసేవాధిక్య ♦ మహిమకంటె
సర్వభూతదయార ♦ స ప్రభావముకంటె
నతులితసూనృత ♦ వ్రతముకంటె
సతతాన్నదానయ ♦ శ్రుతధర్మమునకంటె
నతిథిపూజా మహో ♦ త్యమునకంటె
పరకాంతనిజమాత ♦ కరణిగాంచుటకంటె
నిహపరాస్పదమా య ♦ హింసకంటె
తే॥గీ॥ సాటిలేనట్టి మీనామ ♦ స్మరణకంటె
గలదె వేరొకత్రోవ ని ♦ న్గాంచుటకును॥ పె॥ 58

సీ॥ అన్నదమ్ముల భాగ ♦ మాక్రమించియుసుయో
ధనుడెంతకాలంబు ♦ ధరణియేలె
తమ్మునికోలువులో ♦ దర్పించితన్నియు
దశకంఠుడెన్నాళ్లు ♦ ధరణినేలె
కఠినదండనలచే ♦ క్ష్మాతలంబేలియు
మాగధుండెన్నాళ్లు ♦ మనియెధరణి
సోదరుసతిగూడి ♦ సురతకేళిరమించి
వసుధలోనెన్నాళ్లు ♦ వాలిబ్రతికె
తే॥గీ॥ కఠినముగనీదు భక్తుని ♦ కష్టపెట్టి
ధర్మకశ్యపుడెన్నాళ్లు ♦ బ్రతికెధరణి॥ పె॥ 59

సీ॥ కౌస్తుభోన్నతవక్ష ♦ కరిరాజసంరక్ష
కమలాక్షయాశ్రిత ♦ కల్పవృక్ష
సారాంబుదశ్యామ ♦ సన్నుతసుత్రామ
ఘోరారిభీమ వై ♦ కుంఠధామ
దైతేయసంహార ♦ తపనీయమంజీర
కటిసూత్రధార జ ♦ గద్విహార
యనుపమనయవంత ♦ యమలవిభూషిత
పరమగుణాతీత ♦ భవ్యనేత
తే॥గీ॥ భక్తలోకోపకార భూ ♦ భరనివార
పుణ్యమార్గానుసార సం ♦ పూజ్యధీర॥పె॥ 60
సీ॥ మత్స్యావతారమై ♦ మదసోమకునిద్రుంచి
ప్రాబల్యమెవ్వడు ♦ బ్రహ్మకొసగె
కూర్మమైమంధాన ♦ కుధరంబుధరియించి
యమరాళికెవ్వడు ♦ నమృతమొసగె
వరహావతారమై ♦ వసుధదంష్ట్రిలజీరి
స్వర్ణాక్షునెవ్వడు ♦ సంహరించె
నరసింహమూర్తియై ♦ నఖపంక్తిచేహేమ
కశ్యపునెవ్వడు ♦ గర్వమడచె
తే॥గీ॥ అట్టిమహనీయ సన్మూర్తి ♦ వైననిన్ను
బ్రస్తుతియొనర్పశక్యమే ♦ భవునకైన॥పె॥ 61

సీ॥ వటుడవై పాతాళ ♦ వసుధకు బలిదైత్యు
ధూర్జటిపాదాన ♦ ద్రొక్కినావు
జమదగ్నిసుతుడవై ♦ జనవరేణ్యులగండ్ర
గొడ్డలిచేతలల్ ♦ గొట్టినావు
రఘురామవిభుడవై ♦ రావణాఘుటకర్ణ
క్రూరదైత్యావళి ♦ గూల్చినావు
బలభద్రమూర్తివై ♦ ప్రబలుప్రలంబాది
మదదానవుల బరి ♦ మార్చినావు
తే॥గీ॥ బౌద్ధరూపంబుధరియించి ♦ ప్రబలినావు
కలికితనమున సత్కీర్తి ♦ గాంచినావు॥పె॥ 62

సీ॥ దారిద్ర్యములబాప ♦ దాతవీవనుటకు
ఖండితంబుగ కుచే ♦ లుండెసాక్షి
శరణాగతత్రాణ ♦ బిరుదువీవనుటకు
సత్యంబుగా విభీ ♦ షణుడెసాక్షి
స్థిరపదవిచ్చి ర ♦ క్షింతువీవనుటకు
దివమున విహరించు ♦ ధ్రువుడెసాక్షి
మోక్షప్రదాయక ♦ మూర్తివీవనుటకు
వివరింపకుంజర ♦ విభుడెసాక్షి
తే॥గీ॥ ప్రబలశూరుండవనుటకు ♦ ప్రకటితముగ
శూలిభీకరశరము ద్రుం ♦ చుటయెసాక్షి॥పె॥63

సీ॥ సకలవిద్యలకునే ♦ సార్వభౌముడనంచు
విరివిగామది పిల్లి ♦ వీగలేదు
సర్వమోహంబుల ♦ శమియింపరమియించి
భార్యాహితుడనంచు ♦ పలుకలేదు
విట్టలంబుగ చాల ♦ చుట్టాలసమకూర్చు
సిరులకు దొరనంచు ♦ చెప్పలేదు
ధారుణిబాసిన ♦ పేరుపెంపొనరించు
పుత్రవంతుడనంచు ♦ బొగడలేదు
తే॥గీ॥ పసుగురికి మెప్పుగానైన ♦ కదలలేదు
నళినపత్రాక్ష నిన్నునే ♦ నమ్మినాను॥పె॥ 64

సీ॥ శ్రీరామ శ్రీరామ ♦ శ్రీరామ యనుచును
నీకుమ్రొక్కెదనయ్య ♦ నీలవర్ణ
నరసింహా నరసింహా ♦ నరసింహాయని నిన్ను
ప్రస్తుతించెదనయ్య ♦ భవవిభంగ
మధువైరి మధువైరి ♦ మధువైరియని నిన్ను
బొగడుచుండెదనయ్య ♦ ఖగతురంగ
గోవింద గోవింద ♦ గోవిందయని నిన్ను
కొనియాడుచుండెద ♦ కోమలాంగ
తే॥గీ॥ చక్రధరనిన్ను సేవింతు ♦ సంతతంబు
పుండరీకాక్షనను కృప ♦ బ్రోవుమయ్య॥పె॥65

సీ॥ ఫలమూలకాంక్షల ♦ వదలినిన్నుభజించి
తపములుసల్పిన ♦ ధన్యమతులు
నారాయణ సమర్ప ♦ ణంబంచు వివిదాధ్వ
రములుసల్పిన మహా ♦ రసికవరులు
గోవిందహరి వాసు ♦ దేవ కేశవ యంచు
నిన్నుధ్యానించెడి ♦ నిపుణమతులు
తీర్థయాత్రలకేగి ♦ దివ్యాశ్రమంబుల
దేహముల్ విడిచిన ♦ ధీరవరులు
తే॥గీ॥ భవ్యయానంద సౌఖ్యసం ♦ పన్నులగుచు
నిలచియుందురుకైవల్య♦నిలయమునను॥ పె॥66

సీ॥ మధువైరిసీనామ ♦ మంత్రంబుబఠియించు
విభవశాలికిశ్రుతి ♦ విషయమేల
హారమిత్ర నీశోభ ♦ నాకృతిగనుగొన్న
నిపుణికివైరాగ్య ♦ నిష్ఠయేల
పద్మాయతాక్ష నీ ♦ పాదామృతముగ్రోలు
ఘనునికిదేవత్వ ♦ కాంక్షయేల
దశరథపుత్రనీ ♦ దాసులసేవించు
స్థిరబుద్ధికిధపంబు ♦ సేయనేల
తే॥గీ॥ మోక్షదాయకుడని నిన్ను ♦ దీక్షతోడ
గొలుచుబుణ్యాత్మునకువేరె♦కోర్కెలేల॥ పె॥67

సీ॥ భవదీయ సేవ్యాగ్ర ♦ భంజనంబును లేక
దొలగునే సంసార ♦ దోయదములు
తావకసంస్తుత్య ♦ దావానలము లేక
కాలునే దురితౌఘ ♦ కాననములు
భవదీయచింతనా ♦ బడబానలము లేక
సమయునే షడ్భ్రాంతి ♦ సాగరములు
తావకస్తుత్యప ♦ యోవృష్టియును లేక
నడగునే ఘోరదా ♦ వాగ్నిశిఖలు
తే॥గీ॥ తావకీనమనోజ్ఞ మం ♦ త్రంబు లేక
రోగపంక్తులు వెడలునే ♦ రుద్రవినుత॥ పె॥ 68

సీ॥ అక్రూరుడేమినీ ♦ కగ్రహారము లిచ్చె
విశ్వరూపము జూపి ♦ వెలసినపుడు
గజరాజునీకెన్ని ♦ గజతురంగము లిచ్చె
మచ్చికతో మోక్ష ♦ మిచ్చినపుడు
యుద్ధవుండేమినీ ♦ కూడిగంబులొనర్చె
శ్రద్ధతో స్నేహంబు ♦ సలిపినపుడు
భూసురుండేపాటి ♦ భూరిఛత్రము లిచ్చె
నసమానసంపద ♦ లొసగినపుడు
తే॥గీ॥ వారివలె నన్ను కృపజూడ ♦ నేరవకట
నీకు భక్తుండగానె నే ♦ నీరజాక్ష ॥పె॥ 69

సీ॥ దారాసుతాదులు ♦ దాయాదులాప్తులు
చెడుచుందు రేగాని ♦ చెడకమనరు
మామగారల్లుండ్రు ♦ మరదులు బావలు
చెడుచుందు రేగాని ♦ చెడకమనరు
తల్లిదండ్రాదులు ♦ తగినబాంధవ్యులు
చెడుచుందు రేగాని ♦ చెడకమనరు
యన్నదమ్ములుసచి ♦ వాగ్రణుల్ సేవకుల్
చెడుచుందు రేగాని ♦ చెడకమనరు
తే॥గీ॥ చిత్తజాకారమీదివ్య ♦ సేవనములు
మహిని చెడనిపదార్థముల్ ♦మానవులకు॥ పె॥70
సీ॥ భక్తితో మీనామ ♦ భజనసల్పుదమంటె
నీమీదచిత్తంబు ♦ నిలువబోదు
వదలకేకాదశీ ♦ వ్రతముసల్పుదమంటె
నుదరంబుక్షుద్బాధ ♦ కోర్వలేదు
మనసార దానధ ♦ ర్మములు సల్పుదమంటె
దరుచుగానావద్ద ♦ ధనము లేదు
బుణ్యతీర్థములకు ♦ బోయి మున్గుదమంటె
తనువుచల్లీలకు ♦ తాళలేదు
తే॥గీ॥ క్రూరచిత్తుడనేదురా ♦ చారపరుడ
నెటులబ్రోచెదవోనన్ను ♦ కుటిలహరణ॥ పె॥71

సీ॥ సర్వోపగతుడవై ♦ సతతంబువార్ధిలో
శేషపాన్పునని వ ♦ సించినావు
సకలలోకాధి నా ♦ యకుడవై వైకుంఠ
పతియను విఖ్యాతి ♦ బడసినావు
వరనీలధవళాది ♦ వర్ణయుక్తుండవై
ఘనఘనాంగుడనంగ ♦ దనరినావు
సందరసముబుద్ధి ♦ నరయుచుబుధరక్ష
ఖలశిక్షసల్పుచు ♦ వెలసినావు

తే॥గీ॥ పద్మసంభవ భవసుర ♦ ప్రముఖులకును
నిన్నుగొనియాడదరమానె ♦ నీరజాక్ష॥ పె॥ 72

సీ॥ నిన్నువర్ణించెడు ♦ నిశ్చలాత్ములజూచి
ముక్కోపమున నోరు ♦ మూయువాడు
నిన్నుపూజించెడు ♦ నిర్మలాత్ములజూచి
చేతులుబంధించి ♦ చెలగువాడు
నీమంత్రముజపించు ♦ నియతాత్ములనుజూచి
కొరడాలధళిపించి ♦ కొట్టువాడు
నీదర్శనముగోరు ♦ నిర్గుణాత్ములజూచి
నిడుదబాకుల కనుల్ ♦ బొడచువాడు

తే॥గీ॥ పదిశతంబుల బ్రహ్మాక ♦ ల్పములదనుక
నరకకూపంబునంబడి ♦ బొరలుచుండు॥ పె॥ 73

సీ॥ సతముప్రాతఃకాల ♦ స్నానంబుసల్పుచు
నిన్నుధ్యానించెడి ♦ నిపుణమతులు
కడునిష్ఠనిత్య స ♦ త్కర్మముల్ దీర్చుచు
నిన్నుధ్యానించెడి ♦ నిపుణమతులు
జపతపస్స్వాధ్యాయ ♦ సవనముల్ సల్పుచు
నిన్నుధ్యానించెడి ♦ నిపుణమతులు
సకలజీవావళి ♦ సమబుద్ధినరయుచు
నిన్నుధ్యానించెడి ♦ నిపుణమతులు
తే॥గీ॥ నిన్నుదర్శించి వైకుంఠ ♦ నిలయమందు
నిత్యసుఖములుగాంతురు ♦ నీరజాక్ష॥పె॥ 74

సీ॥ వేటచేపాండుభూ ♦ విభుడు శాపమునొందె
పన్నిదంబున కష్ట ♦ పడి యొనళుఁడు
మధ్యపానంబున ♦ మడిసిరి రాక్షసుల్
కఠినదండనల మా ♦ గధుడునోగలె
బిరుసుమాటలగూలె ♦ ధరశిశుపాలుండు
వనజాక్షికతన రా ♦ వణుడుచెడియె
తగని యీవిత్రిశంక ♦ తనయుండు సత్యసమ్మ
పడరాని యిడుముల ♦ బడిదపించె
తే॥గీ॥ అరయనీషోడు వ్యసనంబు ♦ లందుమమత
తనివివ రింప నెవరికి ♦ దగదుజగతి ॥పె॥ 75

సీ॥ ఆకాశభువనంబు ♦ లంటగట్టగవచ్చు
పెనుబాములనుబట్టి ♦ బెనగవచ్చు
బడబాగ్నికీలల ♦ బక్షింపగావచ్చు
మరణరోగంబుల ♦ మాన్పవచ్చు
జగతీధరంబుల ♦ పగులగొట్టగవచ్చు
కృతసాగరముల లం ♦ ఘింపవచ్చు
కఠినపాషాణముల్ ♦ కరగింపగావచ్చు
పులులతో నైనను ♦ బోరవచ్చు
తే॥గీ॥ పాదుగా ఘోరనదికెదు ♦ రీదవచ్చు
దివిరిమూర్ఖునిహృదయంబు♦ద్రిప్పరాదు॥ పె॥76

సీ॥ కూటసాక్షికి నైన ♦ కులహంతకున కైన
బక్షపాతికి సురా ♦ పాని కైన
గోహత్యకున కైన ♦ గురుతల్పకున కైన
బ్రహ్మహంతకునంత ♦ పరున కైన
గృహదాహి కైన దు ♦ ష్కృత్యనీయున కైన
గోడలిబట్టిన ♦ గుమతి కైన
మరణకాలమున నే ♦ మరక నిన్ను నుతింప
గలిగిన మోక్షంబు ♦ గలుగునిజము
తే॥గీ॥ కమలలోచన నాయంత్య ♦ కాలమునను
దలతునో నిన్ను దలపనో♦దలతునిపుడె॥ పె॥ 77

సీ॥ ఘనముగా నదులలో ♦ మునిగివచ్చితేనేమి
కాషాయవస్త్రముల్ ♦ గట్టితేమి
ముక్కుబట్టుక సంధ్య ♦ మొనసివార్చితెనేమి
యొప్పుగాజపమాల ♦ ద్రిప్పితేమి
పూసలదండలు ♦ పొసగవేసితెనేమి
బూడిదతనువెల్ల ♦ బూసితేమి
దేశదేశములెల్ల ♦ ద్రిమ్మరిగ్గితెనేమి
తీర్థకావడిమోసి ♦ తెచ్చితేమి
తే॥గీ॥ సంతతమునీదు ధ్యానంబు ♦ సలుపకున్న
మనుజుడెటుగను మోక్షస♦న్మార్గపదవి॥ పె॥78

సీ॥ అతివిద్యయుండిన ♦ నన్నవస్త్రము లేదు
అన్నంబుయున్న వి ♦ ద్యయును లేదు
ధనము లెస్సగనున్న ♦ దాతృత్వమును లేదు
దాతృత్వముండిన ♦ ధనము లేదు
భూరిసంపదలున్న ♦ పుత్రసంతతి లేదు
వరపుత్రులున్న సం ♦ పదయు లేదు
స్వాంతసిద్ధియునున్న ♦ సద్గుణంబులు లేవు
సుగుణముండిన చిత్త ♦ శుద్ధి లేదు
తే॥గీ॥ వనజలోచనయిటువంటి ♦ వర్తనముల
ప్రబలుచుండునునిపుడు ప్ర♦పంచమెల్ల॥ పె॥ 79

సీ॥ శ్రీరమాధీశుండు ♦ శ్రీరాముడనిగొల్వ
నలవిభీషణుడగా ♦ నబ్ధిశయన
నారాయణుండు శ్రీ ♦ నరసింహుడనిగొల్వ
ప్రహ్లాదుడనుగాను ♦ పరమపురుష
కమలనాభుడు తార ♦ కబ్రహ్మమనిగొల్వ
పవనాత్మజుడగాను ♦ భవ్యచరిత
యసురాంతకుడు యశో ♦ దాత్మజుండనిగొల్వ
ముచికుందుడనుగాను ♦ మురవిదార
తే॥గీ॥ వారివలెనిన్ను సేవింప ♦ నేరనయ్య
నీదెభారంబునను బ్రోవ ♦ నీలవర్ణ ॥పె॥ 80

సీ॥ దనుజవిభంగనీ ♦ ధర్మకీర్తనముల
విననిపీనులు శైల ♦ బిలములరయ
పరమాంతరంగనీ ♦ పద్యముల్జదువని
జిహ్వాలుభేకల ♦ జిహ్వాలరయ
రుచిరభాషాంగనీ ♦ రూపువీక్షింపని
యక్షులుకేకి పి ♦ చ్ఛాక్షులరయ
మహిజానుషంగనీ ♦ మహిమార్చసలుపని
కరములు శవముల ♦ కరములరయ
తే॥గీ॥ నీతులసివాసనలుజూడ ♦ నేరనట్టి
ముక్కులునుయూరబందుల ♦ ముక్కులరయ ॥పె॥ 81

సీ॥ నిరుపమగుణహార ♦ గురుసమరవిహార
భగవంశవిస్తార ♦ భవవిదార
దుష్టాసురసమీర ♦ ధ్రువసుకృతవిచార
బహుకలుషకఠోర ♦ భయనివార
శ్రితజనమందార ♦ క్షితిజావినోదార
సరసస్వర్ణాంబర ♦ వరసువీర
కౌస్తుభాలంకార ♦ ఘనృపశేఖర
నిఖిలాధ్వరేశ్వర ♦ నిర్వికార
తే॥గీ॥ భవ్యసన్నుతసూర వి ♦ శ్వప్రచార
దంతివైరిగభీర సు ♦ దర్శనకర ॥పె॥ 82

సీ॥ భుజబలాఢ్యులతోడ ♦ బోరెడిశూరుండు
సలుపునేరణము ♦ దుర్బలులతోడ
ఘనపురాణంబులా ♦ కర్ణించుధీరుండు
నెమ్మమైవినునె గొం ♦ తెమ్మకథలు
పరలోకసౌఖ్యముల్ ♦ బడయగోరినధన్య
డిహసుఖంబులకెట్లు ♦ నిచ్చగించు
మధురాన్నములభుక్తి ♦ మరగినభోగ్యుండు
పచ్చడికూటికి ♦ పాలుపడునె
తే॥గీ॥ నీదుచారిత్రేములు విన ♦ నేర్చినేను
గోరబోవుదునేమది ♦ కుచరితములు ॥పె॥ 83

సీ॥ శబరిభరద్వాజ ♦ సంయమీంద్రులొసంగు
నాతిథ్యమొకరీతి ♦ నరసినావు
గుహుడునీవెంటరా ♦ గోరినవనమున
భరతుకన్నను బ్రీతి ♦ బనిపినావు
కలహాభోజన సురా ♦ దులకు జోడొనరించి
నొనరబక్షికి మోక్ష ♦ మొసగినావు
కడలిగట్టెడువేళ ♦ కపిశేఖరులకన్న
నుడుతపై కడు బ్రేమ ♦ నునిచినావు
తే॥గీ॥ దరుచుగావీడు నానిజ ♦ దాసుడనుచు
కరుణనేమాడ్కి నన్నేల ♦ గలవొనీవు॥ పె॥ 84

సీ॥ కూర్మికూతుసుధర ♦ గుమతియైవర్ధిల్ల
చర్చింపగానది ♦ జననితప్పు
జనులుదుష్కృత్యులై ♦ సంచారమొనరింప
భావింపగానది ♦ ప్రభువుతప్పు
పుత్రుండు దురితచా ♦ రిత్రుడై ప్రబలిన
తథ్యంబుగానది ♦ తండ్రితప్పు
స్వాంతప్రియేశ్వరి ♦ జారిణియైయొప్ప
తలపోయగానది ♦ ధవునితప్పు
తే॥గీ॥ యవనిలో యిట్టితప్పులు ♦ నరయలేక
దిరుగుచుందురుమానవుల్ ♦ దివిజవినుత॥ పె॥ 85

సీ॥ శుభమైననీరూపు ♦ జూడగోరినవాడు
యబలలపరికింప ♦ యాశపడడు
భూరిభంగులనిన్ను ♦ బొగడనేర్చినవాడు
పరమదుర్భాషలు ♦ పలుకబోడు
భక్తితోనీవెంట ♦ బయలుదేరెడివాడు
కఠినచిత్తులవెంట ♦ కలయబోడు
సతతంబునీనామ ♦ స్మరణసల్పెడివాడు
నిక్కలపేరు వ ♦ ర్ణించబోడు
తే॥గీ॥ ప్రతిదినమునిన్నునమ్మిన ♦ భక్తవరుడు
వేరెచిల్లర సురులసే ♦ వింపబోడు ॥పె॥ 86

సీ॥ వ్యాలముల్ వసియించు ♦ వల్మీకములమీద
భయమొకింతయులేక ♦ బండినట్లు
హర్యక్షసంఘంబు ♦ లనుదినంబునుబోవు
చేరనిగుహాలకు ♦ జేరినట్లు
మత్తమాతంగముల్ ♦ మక్కువవిహరించు
భూరివాహినులకు ♦ బోయినట్లు
తెలివినిగోల్పోయి ♦ దిరుగుయున్మాదికి
పెక్కువిత్తంబు ల ♦ ర్పించినట్లు
తే॥గీ॥ స్వామినీదాసవరులు దు ♦ ర్జనులతోడ
సఖ్యములుజేసినట్లైన ♦ శ్రమలువచ్చు॥పె॥ 87

సీ॥ శరవహ్ని నెవ్వఁడు ♦ పఱపితోఁరాంభోధి
పొంగించి బంధించి ♦ పొగరుమాపె
ప్రకటతర మహా ♦ త్వంబుచే నెవ్వఁడు
దైతేయదర్పాంధ ♦ తమసమడచె
విమలాబ్జములుద్రెంచు♦ద్విపముమాఁద్రెవ్వఁడు
పంక్తికంధరుకంఠ ♦ వ్రజలుద్రుంచె
యమరేంద్రపురమన ♦ యలరులంకారాజ్య
మునకు నెవ్వఁడు విభీ ♦ షణునినిలిపె
తే॥గీ॥ అట్టిదశరథపుత్రుఁడ ♦ వైననిన్ను
స్తుతియొనర్చుట నలవియే ♦ సురులకైన॥ పె॥88
సీ॥ కూటికై నీచుల ♦ కోరి వేడియుగదా
పడరానిమాటలు ♦ పడుటయవని
ఆలుపిల్లలభ్రాంతి ♦ నంటియుండగగదా
చూడనిదేశముల్ ♦ చూచుటవని
ధనవిహీనంబున ♦ మునిగియుండగగదా
కోరివంచకులను ♦ గొలుచుటవని
మర్యాదపై దృష్టి ♦ మానలేకనుగదా
నోరులుజూచిన భయ ♦ మొందుటవని
తే॥గీ॥ ఇవ్విధంబైన భయభవం ♦ బీదలేక
వివిధరీతుల నిన్నునే ♦ వేడుకొంటి॥ పె॥ 89

సీ॥ శ్రీమహీసుతముద్దు ♦ వానరాంకముననుండ
భరతుండు ఛత్రంబు ♦ బట్టినిలువ
సౌమిత్రిభవ్య విం ♦ జామరల్ విసర శ
త్రుఘ్నుడు పసిడిపా ♦ దుకలుబూన
కేల్మోడ్చి సేవ సు ♦ గ్రీవుండు వినుతింప
సామీరిచరణాంబు ♦ జంబులొత్త
సద్భక్తిమెయి విభీ ♦ షణుడు సూచనదెల్ప
కాంతలుకరదీపి ♦ కలునుబూన
తే॥గీ॥ నిండుకొలువుండి సంతోష ♦ నిరతిమెఱయు
ప్రబలు పట్టాభిరామునిన్ ♦బ్రస్తుతింతు॥పె॥ 94

సీ॥ తాలుగరంగెడు ♦ లీలబిల్చినగాని
బదులుపల్కవదేమి ♦ ప్రౌఢతనము
వివిధభంగులమ్రొక్కి ♦ వేడినగాని సా
త్కారింపవదేమి ♦ జఠరతనము
అతిధైర్యముఙ్బొంది ♦ యనుసరించినగాని
విభవమియ్యవదేమి ♦ వెఱ్ఱితనము
సతమునీపాదయు ♦ గ్మములుగొల్చెదనన్న
పట్టుపడవదేమి ♦ ప్రజ్ఞతనము
తే॥గీ॥ ఇట్టితామసమర్త్యుని ♦ పెట్టరాని
శ్రమలుపెట్టిననీకేమి ♦ సంతసంబు ॥పె॥ 95

సీ॥ జనకములుకొనియాడ ♦ జనకాజ్ఞశిలదాల్చి
యడవికినేతెంచు ♦ టదియెఱుఁగక్క
కరిరాజుమొరవిని ♦ కరుణామయుండవై
నరుదెంచి రక్షించు ♦ టదియురి త్తె
శిలరూపిణియైయున్న ♦ చేరి యహల్యకు
యసువులొసంగిన ♦ దదియుపోల్లు
పాంచాలిమానంబు ♦ భంగంబుగాకుండ
యంబరంబులొసంగు ♦ టదియుకల్ల
తే॥గీ॥ నన్నురక్షించుతేనివి ♦ యన్నినిజము
సూరిమందారదైత్య సం ♦ హారశూర॥ పె॥ 96

సీ॥ రవికులాబ్ధిజనించి ♦ రామనామముగాంచి
దాటకినొంచి య ♦ ధ్వరముబెంచి
హరువిల్లుఖండించి ♦ యవనిజవరియించి
జామదగ్నిగలంచి ♦ సంభ్రమించి
జనకాజ్ఞవహియించి ♦ వనములకేతెంచి
ఖరదూషణులద్రెంచి ♦ ఘనతమించి
వాలినివధియించి ♦ వనధిగర్వమడంచి
దశకంధరునిద్రుంచి ♦ దయవహించి
తే॥గీ॥ యలవిభీషణుపాలించి ♦ నట్టినిన్ను
ప్రాభవంబునగొల్తు ప ♦ ట్టాభిరామ॥ పె॥ 97

సీ॥ విజయంబుదరదర ♦ విందసుందరపత్ర
నేత్రభవ్యమనోజ్ఞ ♦ గాత్రనీకు
విజయంబురిపుకరి ♦ వివిధశిక్షాంకుశ
విమలప్రకాశని ♦ వేశనీకు
విజయంబుసత్సంగ ♦ విహగతురంగభూ
ప్రియకన్యచిత్తాబ్జ ♦ భృంగనీకు
విజయంబుసముదాయ ♦ ప్రియవరనుతలోల
జిగిజితహైమను ♦ చేలనీకు
తే॥గీ॥ విజయమద్భుతకమలాప్త ♦ వేడ్కపుత్ర
పరమరాజ్యకారణ దయా ♦ భరణనీకు॥పె॥ 98
సీ॥ భవ్యంబునీకు పా ♦ వన భాస్కరాన్వయ
దుగ్ధవార్ధిహిమాంశ ♦ దురితనాశ
కుశలంబునీకు న ♦ కుంఠితాసురశైల
భాసురపవిధార ♦ భవవిదూర
భద్రంబునీకు శ్రీ ♦ పార్వతీహృదయాబ్జ
షట్పదసన్మిత్ర ♦ సత్యగాత్ర
క్షేమంబునీకు సీ ♦ తాముఖాంభోరుహ
వికసితఖద్యోత ♦ విమలచరిత
తే॥గీ॥ భావుకముపీతకౌశేయ ♦ వాసనీకు
మంగళము రత్నరాజిత ♦ మకుటనీకు॥పె॥ 99

సీ॥ కడుభక్తివెలయ రం ♦ గస్వామిరెడ్డియు
వ్రాసెనీశతకంబు ♦ వసుధలోన
చదివినవారికి ♦ సౌభాగ్యసంపదల్
విన్నవారికిగల్గు ♦ విష్ణుపదవి
వ్రాసినవారికి ♦ వర్ధిల్లు శుభములు
హరికృపనీకృతి ♦ నవనియందు
నాచంద్రతారా వి ♦ రోచనంబై చాల
విలసిల్లుచుండును ♦ విబుధులార
తే॥గీ॥ లక్షణవిరుద్ధములునున్న ♦ లాక్షిణికుల
దిద్దుడని వేడుకొంటిని ♦ ధీరమతిని ॥రా॥ 100

శ్రీరామచంద్రశతకము
సర్వము
సంపూర్ణము.
శ్రీ శ్రీ శ్రీ.

